శ్రీరస్తు

శ్రీగణేశాయనమః

# భద్రాద్రిశ్రీరామశతకము

ఇది

పెద ఆవటపల్లె గ్రామనివాసులగు

ఆవటపల్లె గోపాలకృష్ణయ్యగారి ద్వితీయపుత్రుండగు

రామకృష్ణయ్యగారిచే

రచియింపబడి

బెజవాడ వాణీముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

500 ప్రతులు

1906

శ్రీరస్తు

శ్రీగణేశాయనమః.

# భద్రాద్రి శ్రీరామశతకము.



సీ॥ శ్రీరామనీమీఁదనీసపద్యంబులు - చెప్పఁబూనితినయ్యచిత్త
గింపు। శ్రీరామనీవునాజిహ్వాయందుననుండి- చిన్నిముద్దులపల్కుఁ జెప్పవల
యు। శ్రీరామనిన్ను నేఁ జేరిమ్రొక్కితిఁగాన-నాయందుదయయుంచునమ్మి
నాఁడ। శ్రీరామనామదిచిత్తమం దేయుంచి- రంజిల్లఁ జేయవేరామచంద్ర॥
తే॥ నీదునామంబుఁదలఁచిననిఖిలజనులు।పరమపావనపరులైరిపరమపురు
ష। భక్తికొలదియుఁ జెప్పితిభక్తవినుత।భద్రగిరిధామ శ్రీరామభవవిరామ॥ 1

సీ॥ శ్రీరామ శ్రీరామ శ్రీరామయనుచును - సారెసారెకునిన్ను స్మ
రణఁజేతు। మదియందునెప్పుడేమరక నీనామంబు- దలఁచుట కెప్పుడుదయ
నొసంగు। దీనజనుఁడనునాదిక్కు-నీవంటిని-దయయుంచునావిూఁదఁదప్పవ
లదు।మానవకోటిలోమర్మంబు దెలియక- మతిమాలినట్టులమసలుచుంటి॥
తే॥బుడమిది క్కే-దియాధారభూతమేది। నిన్ను విడచిననేనెట్లునిల్వఁగలను।
గాచిరక్షించునన్నేలుకమలనామ।భద్రగిరిధామ శ్రీరామభవవిరామ॥ 2

సీ॥ భారతగ్రంథముల్ పరికించగాలేదు-భాగవతాదులన్బట్టలేదు।
రామాయణంబునురాపడించఁగలేదు - వేదశాస్త్రంబులు వెదుకలేదు।
కావ్యగ్రంథంబులుకలలోనవినలేదు-కవితావిచక్షణల్కానలేదు।సంగీతవి
ద్యలుసాధించఁగాలేదు-తాళముల్వర్ణన తెలియలేదు॥ తే॥ ఇలనువ్యర్థుఁడ
నేనేమియెఱుఁగనయ్య। గానగతినీవెనాకుసత్కారుణాతోడఁ। గరినిఁగాచి
నరీతినన్ గావవలయు। భద్రగిరిధామ శ్రీరామభవవిరామ॥ 3

సీ॥ భద్రాద్రిరామనీభజనఁజేసెదఁగాని- యల్పదైవములనేనను
సరించ। సీతాసమేతనీచెంతఁజేరితిఁగాని- చిల్లరవిబుధులచెంతకరుగ। నా
నందముగనిన్ను నాత్మలోఁదలఁచితి - మదిని నెప్పుడునన్ను మఱవకుండు।
పట్టాభిరామనిన్ భక్తితోఁదలఁచెదఁ- గాచిరక్షించెదుఘనుఁడవంటి॥ తే॥
నెమ్మిఁగోదండరామనిన్నమ్మియుంటి। దీనుజనులనుగావంగదిక్కు నీవె। సా
గరంబునఁబడియుంటిసాకునన్ను।భద్ర॥ 4

సీ॥ కాశిగయాదులంగలదిరుగఁగలేను - గంగఁదెచ్చియు నేనుగా
యలేను। దీర్ఘయాత్రలునేనుదిరుగంగనేఁజాల- యజ్ఞయాగంబులనరయ
లేను। సప్తజలధులందుస్నానమాడఁగలేను - సప్తాహములుమెండుసల్ప
లేను।దిక్పతియాత్రలుతిరుగంగనేనేర- యమునగంగానదులరసియెఱుఁ
గ॥ తే॥ నేమిసేయుదునేనెంచఁబామరుఁడను।బరమపావననీయందుభక్తి
యుంచి। భజనఁజేసెద నెప్పుడుభవ్యముగను॥భద్ర॥ 5

సీ॥ భద్రాద్రిరఘురామ ప్రాపుఁగోరితిఁగాని- కూటికిగుడ్డకుఁగోర
లేదు। దుర్జన జయవీరదుష్టసంహారణా- దురితముల్బాప వేదురితహరణ।
రాక్షససంహార రావణాంతకవీర- కాకాసురహరనన్గావవయ్య। కాపాడ
వేనన్నుఁగరుణాసముద్రుడా- ప్రహ్లాదవరదనిన్బ్రస్తుతింతు॥ తే॥ నిన్నుఁద

లఁచినవారెల్లనిఖిలమైన। దుఃఖముల్బాసిదురితముల్ తొలఁగిపోయి। ని
శ్చయముగనిస్తూతురునిర్మలాత్మ॥భద్ర॥ 6

సీ॥ సీతావమేతుఁడా।శ్రీరామనీవునా - జేపట్టుకొనవలెఁజెలువుమి
గుల। కౌసల్యతనయుఁడాకాకుత్థ్సకులదీప- కావవేయిపుడునన్గరుణతోడ।
దీనశరణ్యుఁడాదివ్యాంబరమువాఁడ - గరుడవాహననన్నుఁగావవయ్య।
భక్తజనసుపోషభవ్యచారిత్రుఁడా- భక్తునినన్నుఁగాపాడవయ్య॥ తే॥నే
నుజేసెదుస్మరణచేనెమ్మినుంచి। నీదుదాసులలోనెక్కనిగనునన్ను। నెంచి
చూడంగవలెనయ్యయిందిరేశ।భద్ర॥ 7

సీ॥ ధరణిలోనూతేండ్లుదరగనితపసులై - కూర్మితోనీచెంతఁగూ
డుకొనిరి। జపములువ్రతములుజపమాలికలుద్రిప్పి- జాగరీకులునీదుజాడఁ
గనిరి। హరిదాసులందఱునాత్మసిద్ధినిబొంది - నీలోనఁగలిసిరినిజముగాను।
నిత్యాన్నదానముల్ నిర్మలంబుగఁజేసి- నీపదవొందిరినిష్ఠతోడ॥ తే॥ నీదు
నామంబుఁదలఁచియునిఖిలజనులు। పూర్వప్రారబ్ధముఃవీడిపుణ్యులైరి।
కృష్ణనినుగొల్తునాచేతనేమికాదు।భద్ర॥ 8

సీ॥ నిరతంబునన్నుర్వినీచవృత్తినినుంచ - న్యాయంబుగాదదియ
మరవినుత। నిన్నునమ్మినవాఁడనీరజదళనేత్ర- నామనవివినుముకామజన
క। జపములుతపములుజపమాలికలుద్రిప్ప - సాహసుండనుగానుజక్రపా
ణి। నీనామకీర్తనల్ నిజముగాఁజేయంగ - నిన్నెంచనేనెంతనిర్మలాత్మ॥
తే॥ దీనజనుఁడనుదయయుంచుదీనరక్ష। వాక్కుయందుననిల్వుమీవాసు
దేవ। యేనుజేసినపద్యంబులెలమిఁగొమ్ము। భద్ర॥ 9

సీ॥ సప్తసాగరములుచక్కఁబెట్టఁగవచ్చుఁగావనగిరులనుగలయవ
చ్చు।నాకాశమరచేతనణచిపట్టగవచ్చుఁ-గుతలంబుపగులంగగొట్టవచ్చు।
బావకుజ్వాలలోఁబరగదూరఁగవచ్చు - నాదిశేషునిపట్టియణఁపవచ్చు।
సంజీవికొండనుజక్కఁగాఁదేవచ్చు - బాతాళమునకెంచఁబాఱవచ్చు॥
తే॥ నీరజాక్షుఁడనీభక్తినిలుపఁజాలమేమి। యెఱుఁగనునేవట్టిహీనజనుఁడ।
కాంచిరక్షించునాయందుఁగరుణయుంచు॥భద్ర॥ 10

సీ॥ కరిరాజవరదనన్గనులఁజూడఁగవలె- నాత్మశరణ్యుఁడాయాద
రించు। భోగీంద్రశయనుఁడాబుద్ధినాకొసగుము- కవితావిచక్షణగానవల

యు। దీనశరణ్యుఁడాదీవించవలెనన్ను - దివ్యాంబకుఁడనాకుదృష్టినిమ్ము।
పద్మలోచనన్ను బాలించిదయతోడఁ - జెప్పినపద్యముల్ జెల్లనిమ్ము॥ తే॥ నీ
దునామంబునాజిహ్వానిండనిమ్ము। అమృతసారంబువిందునే ననుభవించి।
యఖిలదురితములను జెందనవనియందు॥ భద్ర॥ 11

సీ॥ శ్రీరామనన్ను వేఁజేపట్టుకొనుమన్న - బెదరించితిరిగెదుపెం
కెతనము। ఆర్తశరణ్యుఁడాయాదరించుమటన్న - నగుపడకుండుటయతిశ
యంబు। కరుణాకటాక్షునిన్ననులఁజూతునటన్నఁ - గనబడకుండుటగడుసుఁ
దనము। శరణాగతత్రాణశరణుజొచ్చెదనన్నఁ - జేతికిదొరకవుశ్రేష్ఠతనము॥
తే॥ ఆత్మయందుననిన్ను సేనరయుచుంటిఁ। దొలఁగిపోవుటనీకెంచదొడ్డత
నము। కాంచిరక్షించవేనన్ను గరుణతోడ। భద్ర॥ 12

సీ॥ దారుణపాపముల్ దగజేయుటనునీదు - నామంబుదెలియరు
నరులుధరణి। కేశవాయనినిన్ను గేవలమెంచిన - క్లేశముల్ దొలఁగునుకృ
ష్ణవర్ణ। నారాయణాయనినమ్మిభజించిన - నరకముల్వీడిపోవునరకహరణ।
గోవిందయనినిన్ను గొలిచినమాత్రాన - గోవులేగనుప్రేమగొన్నయట్లు॥
తే॥ నీదునామంబుదలఁచినఖిలజనుల। నట్లగాచెదవీవదియరయలేక।
పెక్కుసురలనుగొల్తురుప్రేమతోడ॥ భద్ర॥ 13

సీ॥ దానధర్మంబులుఁదగనియ్యఁగాలేను - మంచికొలకులుద్రవ్విం
చలేను। వనములుతోటలువరుసవేయఁగలేను - మించినగుళ్ళుకట్టించలేను।
అన్నసత్రంబులునమరపెట్టగలేను - కోర్కెక్రతులనందుకొనగలేను। ఇ
లదేవతలకునేనింద్లియ్యగాలేను - నన్నేమిచేసెదోనళిననేత్ర॥ తే॥ కుటిల
బుద్ధినినీయందుఁగూడనీక। వ్యర్థుఁడనునేనునను విడనాడవలదు। కాంచి
రక్షించినీలోనఁగలపవలయు॥ భద్ర॥ 14

సీ॥ పతితపావననిన్ను బలుమారుతలచినఁ - బాతకస్తోమంబుపాసి
పోవు। రామహరేయనిరద్దిగాఁబిలచిన - రాఁబోవుదురితముల్రాకయుండు।
స్థిరమతియునగల్గిచిత్తమందుననిన్ను - సేవజేసినవారుసిద్ధిగాంత్రు। దోసి
లొగ్గినవారిదురితముల్బాపెదా - కలుషరహితనిన్నుదెలియలేక॥ తే॥ వె
ఱ్ఱిమతిగల్గితిరిగెదువెంగలిజను। లితరదైవంబులన్వేడియిడుములంది। కాన
జాలరుసత్యమార్గంబునెపుడు॥ భద్ర॥ 15

సీ॥ అభయమిచ్చితివిసీవార్తుల(బోతు - సంచామాటమీాగన్యా యుంబుగాదు। ఆర్తులలోపలన(గగణ్యుండనేను-గావుననన్నావుకమలనాభ సీచబుద్ధులచేతనిన్ను నమ్మంగలేరు - భవదీయగుణములుభక్తుండెఱుంగు। సీమహాత్మ్యంబునునిజముగాంగనలేరు- సీదాసులందరుసీరజాక్ష॥ తే॥ సీదుసత్యంబునిలజనుల్ నెమకలేరు। నిన్నుసమ్మిననరులకునిరయమేది। నమ్మిననునిన్నె మనమందునమ్మవలయు॥భద్ర॥ 16

సీ॥ తరణికులేశనాతప్పులుండినగాని- సీనామరచననేనెగడుచుండు। ధరసుతానాథనాదురితంబులుండిన-రామనామంబునరాలిపోవు। సురనదివంకరై బరువడిపాఱినం - జడునెయందలివారి(శేష్ఠమెన్న। సీమహాత్మ్యంబునునిజముగాందెలియంగ- నిన్నెంచనేనెంతనిర్మలాత్మ॥ తే॥ నేను జేయుపద్యములందు నెరసులున్న। రామసీనామరసముచే (గాలుచుండి। ఇలనునా(గంధమెప్పుడునిలచుంగాక॥భద్ర॥ 17

సీ॥ పాతకాస్పదుడనుబాలించవలెసీవు - పాపముల్ాపుచుంబరమపురుష। దుష్టవర్తనుడనుదూరవేనాలోన- దురితంబులెడవుచుదురితహరణ। దుర్విచారుడనేనుదూరుకునీలోనం- (దోవనాకియ్యవేతోయజాక్ష। కర్మవియోగినింగారణహరునిం - గలయంగనియ్యవేకమలనాభ॥ తే॥ నన్నునీలోనంజేర్పంగన్యాయమయ్యా। దురితపూర్ణునిదోషముల్ తొలంగంజేయ। సీవుతప్పిననితరులుగావగలరె॥భద్ర॥ 18

ఎత్తి। యాచార్యులకుదండములు దక్షిణనుసరింపుచు(మొక్కి-యమరంగభక్తులకంజలిపేసి - స్తుతకవులకునమస్కృతులునల్పి। రామనామసుధనురంజిల్లంగను(గోలి- రచియించుకుజనుల్ రక్తిగాను। తాత్పర్యమునునిపుధరణీశవినుమిది-తక్కువులేమున్నదయలొసంగు॥ తే॥ నిన్నునమ్మినేశతకంబు వన్నెమీార। నల్పుచుంటినినిఖిలేశజయమొసంగు। కావవలయునన్నిప్పుడుకరుణతోడ॥భద్ర॥ 19

సీ॥ వారిజాక్షుడనిన్ను వదలకతలంచినం- గాపాడవలెనన్నుగరుణతోడ। పద్మనాభాయనిపలుమారుపిలచినం- బలుకైనపలుకవువాంఛతోడ। మధుసూదనాయనిమఱవకపిలచిన - మాటైనవినరాదెమనసుదీర। హరికృష్ణయనినిన్నునాత్మలోందలంచిన - అభయమొసంగవేయభయహ

స్తు॥ తే॥ నీదునామంబునెన్నంగ నేర్పుగలదె। శరణాగతవత్సలశరణన్న సాకు బిరుదు। శరణుజొచ్చితినను వేగ నరయుమయ్య॥ భద్ర॥ 20

సీ॥ శరణాగతత్రాణబిరుదువహించితి- శరణుజొచ్చినవానిసాకవలదె। చెయిజూచినిన్ను నేఁ జేరఁదియ్యఁగనున్న - జేపట్టకిట్టులఁ జెలుపవలదు। చేరబిలచిసరిఁ జేరిదాసునిమొరఁ - జెవినిండనాలించఁ జెల్లునీకు। దాసులతప్పులుదండంబుతో సరి -చేతులొగ్గితిదరిఁ జేర్చవలయు॥ తే॥ దోషహరుఁడవుఁదోషముల్ తొలగఁజేసి। దారిజూపవెనాతండ్రిధర్మగూప। దీనరక్షకనను బ్రోవుదివ్యముగను। భద్ర॥ 21

సీ॥ హృదయంబులోనుండి యెఱిఁగి జెప్పకవలె- నాచేత సేవానునలిననాథ। ఆత్మసిద్ధియు లేనియక్షరముండునా- భగవంతుదయ లేక ఫలము గలదె। నీబలంబును లేక నిర్వహింతురె నరుల్- నీశక్తిదప్పిననిలువగలరె। ఈశ్వరానీదయయింపొందగాలేని-త్రోవదప్పియుపోరెదోషజనులు॥ తే॥ అయ్యమాతండ్రినాయాత్మయందె నిలచి। భావియందుననుదకంబువచ్చినట్టు। బుద్ధియందుననీధారపూర్ణమిమ్ము॥ భద్ర॥ 22

సీ॥ కోతికిశక్యమా కొండలన్నియు దెచ్చి-సాగరంబునుగట్టసాధ్యమౌనె। సుగ్రీవు డెలమిని జూడకయున్న- బలశాలివాలిని గెలువఁగలఁడె। ఆంజనేయునకు నీయండలేకుండిన- లంకాపురముగాల్పి రాగలండె। పార్థునకునునీబలమెన్న లేనిది- కురుబలంబుల నెల్లఁ గూల్చఁగలఁడ॥ తే॥ ఇలనునీశక్తిలేకున్న నెవరివశము। పుడమిజనులకు నాధార [illegible] తోడును లేనిదినిల్వగలర॥ భద్ర॥ 23

సీ॥ ఆర్తశరణ్యుఁడా యాదుచుంటినినిన్నుఁ- గాపాడుదీవంచుఁగా చియుంటి। బహుపరాక్రమశాలిభారమేనీదంటి- పాపవేపాపముల్ పరమపురుష। కోదండములవాఁడ కొలువుగొలచెదనంటి - గోయనిబిలచిన గూడుమంటి। భుజబలంబులవాడ పుష్పాస్త్రజనకుడ - కాపాడవలెనన్ను గరుణతోడ॥ తే॥ నీకుసాటైనదైవంబు నెమకలేఁడటంచు। గజమెక్కి జయభేరియఖిలదిశల। మ్రోయవాయుంతుఁజిత్తమామోదమొదవ॥ భద్ర॥ 24

సీ॥ సలలిత రామనీసారమంత్రంబెన్న - సాంబమూర్తికిగానిజక్క బసదు। నీపాదరజమునునిజముగాఁదెలియన-హల్యకుమరిగానియను

భవంబె। నీసత్యవాక్యముల్ నిజముగాదనుజో త్త- ముండు రావణునితమ్ము
నకు దెలియు। నీమహిమల నెల్ల నిండుగా దెలియంగ - నారదునికైగాక యేరి
కలదె॥ తే॥ నీదుసామర్థ్యమెంచంగ నేర్పుగలదె। సచ్చిదానందమూర్తి
విస్వామి నీవు। నీదుదయకును బాత్రుండ నేనుజగతి॥భద్ర॥ 25

సీ॥ అవనిలో హాలికుడతికష్టపడుచుండ- హాలాగ్రమున నర్థమబ్బిన
ట్లు। దప్పికచేతను తహతహపడువాని- నను వెప్ప నమృతమబ్బినట్లు। చేప
ట్టవలెనన్న జేతికందని పండు- కరముసాచిన నద్దిదొరకి । అజ్ఞానపరు
నకు నవనీతలంబున వడి- జ్ఞానసరణిగన్పడ్డయట్లు॥ ఆ॥ సాగరంబునంబడి
పోవుజనుల కెలమి । దరికిజేర్చుటకును నోడదొరికినట్లు । మలినచిత్తుని నీ
యందు మలపినావు॥భద్ర॥ 26

సీ॥ అప్పుదెచ్చిన ద్రవ్యమనుభవింపగనేమి - యాకలికానిదియ
న్న మేల। ఆలకించని వేల్పునతని వేడగరాదు - ప్రేమలేకుండినం బిల్వరా
దు। పిలచినమాత్రాన బలుకకుండగవాని - తలుచుగా వానినిదలంపరా
దు। పెడమొగమును బెట్టి పెడపెడగానుండు- జెనుని చెంతకు నైన జన
గరాదు॥ తే॥ అట్టివాడవుగావని యఖిలజనులు। పొగడుచుండిరి పురుషో
త్తముడనినిన్ను। నమ్మితలంతును మనమందు నలిననేత్ర॥భద్ర॥ 27

సీ॥ సజ్జనపరిపాలచాతుర్యమున నీవు- సకలలోకంబులు సాదుకొ
నుచు। దుష్టులశిక్షయు శిష్టరక్షణమును - జేయుచుంటివి నీవు శ్రేష్ఠముగను
భక్తుల నెల్లను బరిపరివిధములం- బాలింపుచుంటివి పద్మనాభ । హరిదాసు
లందున సత్యంతమైనట్టి- యనురాగమెప్పుడు నమరియుండు॥ తే॥ ఆదివిష్ణుం
డవంచు నిన్ను మరవరులు। పొగడుచుందురు సతతంబు భోగిశయన । తపసు
లందఱు నినుమదిందలంచుచుంద్రు॥ భద్ర॥ 28

సీ॥ పరమదయానిధే పతితపావననామ- పలుమారు నిన్నెంచ భా
ఘలడగు। పాపభంజన నీవు పాలించవలెనయ్య- ప్రాపుగోరెద నయ్య పరమ
పురుష। బలరామమూర్తికి బలముగా సాయమై- దుష్టుల నెల్లను ద్రుంచి
నావు। శిష్టరక్షణమును శీఘ్రంబునను జేసి- వెలుగొందినాడవు కలుషహ
రణ॥ తే॥ నీదుమహిమలు నెంచంగ నేర్పుగలదె । నీవు దలచిన నఖిలము నీ
ల్లగలదె। అమరనుత నామ భానువంశాబ్ధిసోమ॥భద్ర॥ 29

సీ॥ ముదిమివచ్చిన వేళ ముంగిట కింకరుల్ - నిలచియుండెడు వేళని
ల్వఁగలమె। వ్యాధివచ్చిన వేళ వసటనొందెడు వేళ - పైత్యముల్ గప్పినబ
లుకలేను। హరిరామ హరికృష్ణ హరియచ్యుతాయని - పలుకుదునో నోటఁబ
లుకలేనొ। తెలివిగలిగిన నేను దేటగానుండగా - నిన్ను నేఁదలఁచెద నీరజా
క్ష॥ తే॥ రామ నను బ్రోవుమనుచును రాత్రిపగలు। తలచుచుంటిని నిను నేను సత
ధ్యముగను। రామ శ్రీరామ కోదండరామ॥ భద్ర॥ 30

సీ॥ రామకథాసుధ రక్తిగాఁ దెలియంగ - నార్యులకందఱికసుభ
వంబు। ప్రహ్లాదనారదపరమపావనులకు - వ్యాసాదిమునులకు సమరఁదె
లియు। రామమహిమ నెల్లఁ బ్రకటంబుగాఁ గాంచి - ముక్తిని జెందిరి ముద
ముగాను। వాలియు తనకన్న బలుఁడెవ్వఁడంచును - నీశరంబునఁ బడి నిన్నుఁ
జేరె॥ తే॥ రావణుడు కుంభకర్ణుఁడు రణమునందు। వైరులై పడి నీ చెంతఁ జేరి
రయ్య। నన్ను నెబ్భంగిఁ జేర్చెదో నళిననేత్ర॥ భద్ర॥ 31

సీ॥ సిరులిచ్చుటకు నెంచ సీతామహాదేవి - జనులను రక్షింపఁ జక్రపా
ణి। ఆపదల్ తీర్చుటకంజనీతనయుండు - సాధించకుంటకు సాంబమూర్తి।
మాపునకర్కుండు సోముండు శాంతికి - నాయున్రసకు బ్రహ్మ యమరియుండ।
చదువునకు గురుండు క్షమకు విశ్వంభర - వాక్కుందున జురాణి వదలకుండు॥
తే॥ నీదు నామంబు మహిమచే నెగడె నిన్ను। నిన్ను నిత్యము దలఁతును నీర
జాక్ష। మఱవ కెప్పుడు నీయందు మది నినుంచు॥ భద్ర॥ 32

సీ॥ రామ నీ పేరు తిరంబుగా నా జిహ్వ - నొప్పుగా వ్రాయుమీ తప్ప
వలదు। గళమువ శేకివ స్తనముగాఁ దలఁచుట - మఱవక యెప్పుడు మదిని
నుంచు। మతినిమాలినవాని మతిని దెచ్చుటరీతిఁ - జేయవలయు నన్ను శ్రే
ష్ఠముగను। నీపేరు స్మరణంబు నిర్మలంబుగఁ జేసి - పాపలతల నెల్లఁ బరగఁగో
సి॥ తే॥ పరమపదవిని జెందెదఁ బరమపురుష। దోసిలొగ్గితి నాయందు దో
షమెంచ। కీవె నన్నేలు కరుణతోఁ గృష్ణవర్ణ। భద్ర॥ 33

సీ॥ శబరి తన్ననుకంపసాకంగ వేఁడంగఁ - జెలువుగా నీలోకిఁ జేర్చినా
వు। అలకుచేలుఁడు నిన్ను నాశ్రయించిన తఱి - గ్రక్కునన టుకులు మెక్కి
నావు। ఉడుత యుభక్తి చేయ వ్రేత వ్వచుఁ బోయ - నవ్వుచు నల్లన దువ్వి
నావు। ప్రహ్లాదుఁడని పేరు పల్కసమాత్రానఁ - బరుగున వచ్చి కాపాడినా

వృ॥ తే॥ గజముపిలచినమాత్రానఁగరుణతోడఁ। గాంచిరక్షించినావె యఘనముగాను। అట్టిప్రేమనునాయందుఁబెట్టుమయ్య॥భద్ర॥ 34

సీ॥ సత్యవాక్యుఁడవనిజక్కఁగావింటిని- శరణాగతత్రాణసాకున న్ను। అభయహస్తమొసంగుమాత్రరక్షకనీవు- దయమొసంగుమునాకు దప్పకుండు। నిగలసమస్తముల్ వివరింపఁగావలెఁ- బుడిమిదోషములను బాలియఁజేయు। మూడులోకములకుముఖ్యమాధారుఁడ - వాదివిష్ణుఁడ వునీకంతులేదు॥ తే॥ తెలిసితెలియకవెఱ్ఱినైతిరుగుచుంటి। వివరమొసఁ గుచునిప్పుడువేగిరమున। నన్నునేలుముకరుణతోఁగన్నతండ్రి॥భద్ర॥ 35

సీ॥ భక్తవత్సలనన్నుఁబాలించవలెఁగాని - పాలింపకున్ననీపాద మాన। కౌసల్యనందనాకాపాడవలెఁగాని - కాపాడకున్ననీకన్నులాన। దశరథసుతనీవుదయనుంచవలెఁగాని- దయనీయకున్ననీదాసులాన। ప ట్టాయతాక్షుఁడాపాలించవలెనయ్య- పాలింపకున్ననీభక్తులాన॥ తే॥ ఒ ట్టుపెట్టితినచునీవ్రెల్లకుండు। తిట్టిదీవనుబోఁదనుదీనజనుఁడ। నేనునీబిడ్డ నేమన్ననేమితప్పు॥భద్ర॥ 36

సీ॥ పంచదారమధువుపాలుద్రాక్షలుపర- మాన్నంబుమీఁగడ కన్నమివుల। తీపిమైతనరారుదివ్యామృతంబును - ద్రావలేకజనులుభ్ర మయుచుండ్రు।నీనామసుధగ్రోలినిఖిలమౌనీంద్రులు-పరమసమ్జ్ఞనుబడ సినారు। నీనామమధురంబునీదాసులకుఁగాని - యల్పమతులకెల్లనంటఁ బోదు॥ తే॥ మధువుమానినూనెనుద్రావుమాడ్కినకట। మధురమగు రామనామంబుమఱచిపోయి। యెఱుకలేకచరింతురుహీనమతులు॥భద్ర

సీ॥ కరిమేనిదురదకుకడువేగమునబోయి - గోతిలోపలఁబడిగోలు పోయె।జలచరంబుచవికినిలఁజిక్కినయటులఁ-బిల్వానికిచేతచేటునొందెఁ। గనుజూపుచేతనుగ్రక్కునమిడుతలు- ఘనమైనయగ్నినిగప్పినట్లు। తావి కోసముదేఁటలక్షణంబునఁబోయి - ముప్పుతోనెఱుఁగకమ నిగిపోయె॥ తే॥ నిలనుపంచేంద్రియములునునిట్లుజిక్కి। నిన్నుమఱచియుమ ర్త్యులుని ష్టదప్పి। బోవుచుండెడుమూఢులఁబ్రోవుమయ్య॥భద్ర॥ 38

సీ॥ మునులునీపాదముల్పూజయుచునెప్పుడు- సేవజేయుచునుంద్రుము శ్రేష్టముగను। నీదుపాదంబులునిఖిలజగంబుల - ప్రాణికోటికిపరిపాలసం

ఋ॥ ధరకునాథుండవుదశరథసుతుండవు। ధరను భారముదీర్పఁదనరినావు। సకలసద్గుణవిభూషణవైరిశోషణ - దయరసంబులకెల్లఁ స్థానమీవు॥ తే॥ కామితార్థంబులియ్యంగఘనుఁడవయ్య। పూతభక్తులకాధారభూతమీవు। నీదు ప్రజ్ఞలు నిఖిలమునిలచియుండె॥భద్ర॥ 39

సీ॥ పండితరక్షక పాపవిమోచన- దశకంటుకంఠముల్ తరగినావు। కౌశల్యనందనాఖరదూషణధ్వంస- రాక్షసాంతకవీరరామచంద్ర। కో దండములవాఁడగొప్పశౌర్యుఁడనీకు- నంజలియొనరింతునానతోడ। పూ దండలింపుగాఁబుచ్చుకోవలెనీవు - కవితామృతంబునుగదలకుండ॥ తే॥ నలుతదాల్చినీదాసజనాళికెల్ల। బోధపఱచుమభక్తులపొందుఁజేరి। కల్మ షంబులనెడబాపుకంజనేత్ర॥భద్ర॥ 40

సీ॥ బ్రహ్మాతంద్రిడివటంచుఁబ్రస్తుతింపఁగనిన్ను - సనకసనందనుల్ చాలరైరి। మునులకుసురులకుముఖ్యదైవంబవై - దినకరవంశదేదీప్యము గను। క్షత్రియకులమునజన్మించినానాఁట - పరిపూర్ణబలుడవై ప్రబలి నావు। పక్షివాహననిన్ను బ్రస్తుతించితిఁగాని - పరులనెవ్వరినేను బ్రస్తుతిం ప॥ తే॥ బరమపావననిన్ను నేభక్తితోడఁ। మఱవకెప్పుడుతలఁచెదమన మునందు। మర్మముంచకెప్పుడునన్ను మనుపమయ్య॥భద్ర॥ 41

సీ॥ అండజవాహనాయాత్మయందుననిన్ను - దలచినవారికిఁగలు షహారము। పాపముల్ కొండలభంగిఁబెరిగెఁగాన - వజ్రాయుధంబవై వ రలుమయ్య। నంతతాఖండలసకలవైభవములు - గల్గకమానునేఘనము గాను॥ మోక్షలక్ష్మియుపుకుముంజేతఁగల్గును- ముదమొప్పనిజభక్తహృ దయపదస॥ తే॥ సకలదురితజాలంబులాపమసిపోవు। సకలకార్యార్థపరు షుపసమ్మతముగ। నీకుజోడెవ్వరును లేరునిగమవినుత॥ భద్ర॥ 42

సీ॥ అల్లవిభీషణుడాదరించగమున్నఁ - గపటముంచకవానిఁగాచి నావు। రవినందనమునిన్ను రక్షించమనగాని - దేదీప్యముగఁగోర్కెదీర్చి నావు। కాకాసురుఁడునిన్నుఁగరుణించమనివేఁడ-గరుణించియతనినిఁగా చినావు। కరిరాజుదీనుఁడై కావుకావుమనంగఁ- బనుగుసవచ్చికాపాడినా వు॥ తే॥ అట్టికరుణనునాయందుసమరనుంచి। కావవలయుఁజమ్మినప్పాడక మలనేత్ర। కావకుండిననివియన్నికల్లలందు॥భద్ర॥ 43

సీ॥ హరునకద్రిజకును నాత్మరక్షకుఁడవై - తిరుమంత్రరసమును
దెల్పినావు। పతిదేవతయగు ద్రౌపదియార్తి నెడబాపి- సంతోషచిత్తగా
సలిపినావు। వాల్మీకమునినిన్ను వాంఛతోఁ గొల్వఁగ - స్థిరముగా మునులం
దుఁ జేర్చినావు। నారాయణాయని నమ్మిస్మరించిన - చోరుని చండాలుఁ జో
చ్చినావు॥ తే॥ దురితలతలను గోసెదు దాంగవీవె। దురితముల్ పెట్టుకొని నేను
దూఁగుచుంటి। నాదు దురితంబులను బాపు నలిననాభ॥ భద్ర॥ 44

సీ॥ జుఱ్ఱునసీనామసుధను నేఁజూఱెదఁ - జెలఁగిరుచులచేతజిహ్వ
నిండ। పదకంజతోయముల్ బాగుగాఁ జూఱెద- పాపభంజనవై రివర్గహరణ।
తామసీయమృతంబుఁగా మించి గ్రోలుదు- నిరతంబుముద మొప్ప నీలదేహ।
జూటిజూటియు నేను సుంతైనఁ దృప్తిని - బొందంగ లేనయ్య భోగిశయన॥
తే॥ పరులచందముగాక నీ ప్రాపుగోరి। యలమివచ్చినవాడనో నలిననేత్ర।
గాచుటెప్పుడో యాదీనుగరుణతోడ॥ భద్ర॥ 45

సీ॥ శ్రీకాంతసీతయైశిష్టజనంబులు - వైష్ణవాచార్యులై వైభవ
ముగ। విరజాఖ్యగలవంక విమలగౌతమియయి - వైకుంఠమెన్నంగ భద్రగి
రిగ। ఆదివిష్ణుఁడవు నీవవతారమూర్తివై - యలగిరియందున నమరియుడి।
సర్వలోకములకు సత్వమొసంగుచుఁ - గానరాకుంటివి కంజనేత్ర॥ తే॥ నీ
దుమహిమల నెవరికి నెమ్మిఁ జూప। కిలనుజనులను నీలోన గలుపుకోక। మాఁ
యఁబన్నుచు నున్నావు మాయకుఁడవు॥ భద్ర॥ 46

సీ॥ పరధనంబులనెల్ల బాగుగా హరియించి - పరభామ పొందును
బాగుగూడి। పరులయన్నంబును బాగుగాగుడిచియుఁ - బాపివైతిరిగెడు
పామరుడను। ముఱిపెంబుగానది ముందువచ్చెడి కీడు- కానరాకుంటిమి కలి
యుగమున। దుస్తరంబిదియని దుర్జనులెఱుఁగక - కాలకింకరుబాధపా
లుగాను॥ తే॥ తెలిసి తెలియక వ్యర్థులు తెలివిదప్పి। గోతపడుచు మేముం
టిమి కూడదీసి। కాలునివశము గాకుండఁ గాచవలయు॥ భద్ర॥ 47

సీ॥ ఘోరకృత్యంబులు కొల్లగాఁ జేసితిఁ - గుఱ్ఱులేకను నాదుగుణ
ము చెడగ। నన్యదైవంబులన హరహంబును గొల్చి- యవనివెఱ్ఱినయి నేనా
త్మ జెడితి। ఆత్మగ్రంథంబులననుభవమెన్నక- యపచారములు లెన్సనాడి
యుంటి। ఆర్యులఁ జూచి నేనాదరించఁగనైతి - దుంటరినే మెచ్చుచుంటివన

బు॥ ధరకునాథుండవుదశరథసుతుండవు। ధరను భారముదీర్చఁదనరినావు।
సకలసద్గుణవిభూషణ వైరిశోషణ - దయరసంబుల కెల్లస్థానమీవు॥ తే॥
కామితార్థంబులియ్యంగఘనుఁడవయ్య। పూతభక్తులకాధారభూతమీ
వు। నీదుప్రజ్ఞలునిఖిలమునిలచియుండె॥భద్ర॥ 39

సీ॥ పండితరక్షకపాపవిమోచన- దశకంటుకంఠముల్ తరగినావు।
కౌశల్యనందనాఖరదూషణధ్వంస- రాక్షసాంతకవీరరామచంద్ర। కో
దండములవాఁడగొప్పశౌర్యుఁడనీకు- నంజలియొనరింతునానతోడ। పూ
దండలింపుగాఁబుచ్చుకోవలెనీవు - కవితామృతంబునుగదలకుండ॥ తే॥
నలుతదాల్చినీదాసజనాళికెల్ల। బోధపఱచుముభక్తులపొందుఁజేరి। కల్మ
షంబులనెడబాపుకంజనేత్ర॥భద్ర॥ 40

సీ॥ బ్రహ్మతంద్రివటంచుఁబ్రస్తుతింపఁగనిన్ను - సనకసనందనుల్
చాలరైరి। మునులకుసురులకుముఖ్యదైవంబవై - దినకరవంశదేదీప్యము
గను। క్షత్రియకులమునజన్మించినానాఁట - పరిపూర్ణబలుడవై ప్రబలి
నావు। పక్షివాహననిన్నుబ్రస్తుతించితిఁగాని- పరులనెవ్వరినేనుబ్రస్తుతిం
ప॥ తే॥ బరమపావననిన్నుసేభక్తితోడఁ। మఱవకెప్పుడుతలఁచెదమన
సునందు। మర్మముంచకెప్పుడునన్ను మనుపమయ్య॥భద్ర॥ 41

సీ॥ అండజవాహనాయాత్మయందుననిన్ను- దలచినవారికిఁగలు
షహరము। పాపముల్ కొండలభంగిఁబెరిగెఁగాన - వజ్రాయుధంబవై వ
రలుమయ్య। నంతతాఖండలసకలవైభవములు - గల్గకమానుసేవనము
గాను॥ మోక్షలక్ష్మియుపుణుముంజేతఁగల్గును- ముదమొప్పనిజభక్తహృ
దయసదన॥ తే॥ సకలదురితజాలంబులూపమసిపోవు। సకలకార్యార్థపరు
షవ్రసమ్మతముగ। నీకుజోడెవ్వరునులేరునిగమవినుత॥ భద్ర॥ 42

సీ॥ అల్లవిభీషణుడాదరించగమున్నఁ - గపటముంచకవానిఁగాచి
నావు। రవినందనునినిన్నురక్షించమనగానె - దేదీప్యముగఁగోర్కెదీర్చి
నావు। కాకాసురుఁడునిన్నుఁగరుణించమనివేఁడ-గరుణించియతనినిఁగా
చినావు। కరిరాజుదీనుఁడై కావుకావుమనంగఁ- బరుగునవచ్చికాపాడినా
వు॥ తే॥ అట్టికరుణనునాయందుసమరనుంచి। కావవలయుఁజుమ్మిప్పుడు కక
మలనేత్ర। కావకుండిననిందయన్ని కల్లలందు॥భద్ర॥ 43

సీ॥ హరునకద్రిజకును నాత్మరక్షకుఁడవై - తిరుమంత్రరసమును దెల్పినావు। పతిదేవతయగు ద్రౌపదియార్తి నెడబాపి- సంతోషచిత్తగా సల్పినావు। వాల్మీకమునినిన్ను వాంఛతోఁగొల్వంగ - స్థిరముగా మునులందుఁ జేర్చినావు। నారాయణాయనినమ్మిస్మరించిన - చోరునిచందానఁజూచ్చినావు॥ తే॥ దురితలతలనుగోసెడు దొంగవీవు। దురితముల్ పెట్టుకొని నేను దూరుచుంటి। నాదుదురితంబులను బాపునలిననాభ॥ భద్ర॥ 44

సీ॥ జుట్టునసీనామసుధను నేజూఱెదఁ - జెలఁగిరుచులచేతజిహ్వానిండ। పదకంజతోయముల్ బాగుగాజూరెద-పాపభంజనవై రివర్గహరణ। రామనీయమృతంబుఁగామించి గ్రోలుదు-నిరతంబుముద మొప్పనీలదేహ। జూటిజూటియునేనుసుంతైనఁదృప్తిని - బొందంగలేనయ్యభోగిశయన॥ తే॥ పరులచందముగాకనీ ప్రాపుగోరి। యలమిఁవచ్చినవాడనో వలిననేత్ర। గాచుటెప్పుడోయాదీనుగరుణతోడ॥ భద్ర॥ 45

సీ॥ శ్రీకాంతసీత మైశిష్టజనంబులు - వైష్ణవాచార్యులై వైభవముగ। విరజాఖ్యగలవంకవిమలగౌతమియయి - వైకుంఠ మెన్నంగభద్రగిరిగ। ఆదివిష్ణుడవునీవవతారమూర్తివై - యలగిరియందునసమరియుడి। సర్వలోకములకుసత్వమొసంగుచుఁ - గానరాకుంటివికంజనేత్ర॥ తే॥ నీదుమహిమలనెవరికి నెమ్మిఁజూప। కిలనుజనులనునీలోనగలుపుకొనక। మాయఁబన్నుచునున్నావుమాయకుడవు॥ భద్ర॥ 46

సీ॥ పరధనంబులనెల్ల బాగుగాహరియించి - పరభామపొందును బాగుగూడి। పరులయన్నంబును బాగుగాగుడిచియుఁ - బాపిమైతిరిగెడు పామరుడను। ముటిపెంబుగానదిముందువచ్చెడికీడు-కానరాకుంటిమికలియుగమున। దుస్తరంబిదియనిదుర్జనులెఱుఁగక - కాలకింకరుబాధపాలుగాను॥ తే॥ తెలిసితెలియకవ్యర్థులు తెలివిదప్పి। గోతపడుచుమేముంటిమికూడదీసి। కాలునివశముగాకుండఁగాచవలయు॥ భద్ర॥ 47

సీ॥ ఘోరకృత్యంబులుకొల్లగాఁజేసితిఁ - గుత్తులేకనునాదుగుణముచెడగ। నన్యదైవంబులనహరహంబునుగొల్చి-యవనివెట్టినయినేనాత్మచెడితి। ఆత్మగ్రంధంబులననుభవమెన్నక- యపచారములులెస్సనాడియుంటి। ఆర్యులఁజూచినేనాదరించఁగనైతి - దుంటరినేమెచ్చుచుంటివన

య్యా॥ తే॥ ఏనుజేసిననేరములెంచినీవు। మనసునందిడిమూకైనవినక
యుపుడు। బాములనుబెట్టిచెయివీడవలదువలదు॥భద్ర॥ 48

సీ॥ కంటినిగౌతమింగన్నులకింపుగాఁ- బోడగంటిభద్రాద్రిఁబోలు
పుములఁ। గంటినిశీతనుగనులపండుపుగాఁగఁ- గార్ముకబాణముల్ ఘన
ముగాను। గంటినిమిమ్ములఘునలక్ష్మణుని వేగఁ- గంటిఁగృతార్థినై ఘనము
గాను। అవనికంటకుఁడై నయలరావణునితలల్ - చేతబట్టియునీవుచెండి
నావు॥ తే॥ ఇంతవాఁడవునినుగంటిస్వాంతమలర। నాదుపాపంబులన్ని
యునాశమయ్యె। నిన్నుజూచినవారికినిరయమేది॥భద్ర॥ 49

సీ। జలనిధిజొరబడ్డఖలునిసోమకదైత్యు - చిటికలోపలనీవుచీరి
నావు। కులపర్వతంబునుగోటమీటుచునీవు- పశువులనెల్లఁగాపాడినావు
పార్థివులందఱిఁబట్టికొట్టితివీవు- బలినిపాతాళంబుబంపినావు। రాక్షస
వీరునిరణరంగమునసీవు- చేతిగోళ్ళనుబట్టిజీల్చినావు॥ తే॥ యిట్టివాడవు
నీచాటియవరులేరు। ఖలజనులనుద్రుంచిసుజనులగూర్మిబ్రోచు। కృష్ణని
న్నదినమ్మితినేలుమయ్య॥భద్ర॥ 50

సీ॥ హలరేఖధ్వజరేఖయంకుశరేఖయు - శంఖకమలరేఖచక్ర
రేఖ। బాణవజ్రపురేఖప్రబలమైగనుపించి - నీపాదయుగమందునిండనుం
డు। తేజరిల్లుచునవిదేదీప్యముగనుండు- నాత్మకురంజిల్లనమరుచుండు। అ
ట్టిపాదములచేనవగౌతమసతి- శాపంబుబాపంగజాలినావు॥ తే॥ అట్టిపా
దంబులెప్పుడునమరగొలిచి। నేనుసంతుష్టినొందుదునిర్మలాత్మ। అట్టిచర
ణంబులకెనీతునంజలులను॥ భద్ర॥ 51

సీ॥ నావిన్నపంబునెనరుబూనివినవలె - నీకన్ననాకేరునీరజాక్ష।
నరలోకమునయందునాకన్నపాపియు- లేడెవ్వఁడెంచంగలేశమైన। నిఖిల
పాపంబులనిర్మలంబునుజేయ- నీకన్నదైవంబునెమకలేడు। నీవుదిక్కును
నాకునీరజదళనేత్ర- యీవెజీవనమునునెపుడునాకు॥ తే॥ నిన్నునమ్మి
నేనుంటినినిగమవినుత। యేమిజేసెదొనమ్మనేనెంతవాఁడఁ। గాచియుండవె
ననునీవుకమలనాభ॥భద్ర॥ 52

సీ॥ ననుబ్రోవుమనిచెప్పునారీశిరోమణి - నళినాయతాక్షినీజా న
మ్మినాఁడ। కరుణాకటాక్షునిగరుణించమనినన్ను- గరుణతోఁజెప్పవే పర

మసాధ్వి॥ పద్మాయతాక్షుఁడు పలుకై నబలుక డు - పలుకులాగున జేయుప ద్మనిలయ। దీనహోషకునితో దీవించమనినన్ను - దేదీప్యముగ జెప్పదీనవిను త॥ తే॥ యెంత వేడినఁగరుణయావంతలేక । యున్న హేతువుచేతనిన్నె న్నుచుంటి। అమ్మననుగాచుమని చెప్పుమమ్మసీత॥భద్ర॥ 53

సీ॥ సీతామహాదేవిశ్రీరాముతో నీవు - చెప్పవలయునమ్మ చెలువు మిగుల। భక్తుని ప్రార్థనల్ బాగుగావినమని - భగవంతునను బ్రోవఁబనుపవల యు। ఆత్మలో పలనునీవాసక్తి నామీద - నునిచి నారాయణుసనుపవలయు। కేళికాగృహమందు కేళిస ల్పెటివేళ - జ్ఞాపకంబును జేయగడగవలయు॥ తే॥ తల్లినినునమ్మినాడనుతలిరుబోడి। రాముతో జెప్పి। వేగనన్నో మవల యు। అమ్మనినునమ్మినాడనన్నాదుకొమ్ము॥భద్ర॥ 54

సీ॥ ఇలనుగోపన్న యునిడుమలుబడుచున్న - గప్పమంతయునిచ్చి గాచినావు। తగనిపట్టునుపట్టతానేమకప్పుడు - వసువిచ్చిదర్శనమొసఁగి నావు! గయునిచంపెదనని ఘనశబ్దమును జేసి - కాళ్ళపడగవానిగాచి నావు। కాళిందిమడుగునఁగర్కోటకునిబట్టి - కాళ్ళద్రొక్కియునీవుగాచి నావు॥ తే॥ యిట్టివాఁడవు నిన్ను నే నెట్టువిడుతు - నమ్మిననునమ్మవలెనిన్ను నారసింహా। నిన్ను విడచిన నేనెందునిల్వ లేను॥భద్ర॥ 55

సీ॥ నీరజనాభ నిన్ను లుపఁజాలరుమది - నిలను వైరిమనుజులెరుక లేక। నిన్ను మదినినిల్పి నిజముగాదలచిన - నీవంటిదైవంబు నెమక లేదు। సకలమూర్తులకునునన్ను తొంగుఁడవీవు- సకలకార్యములకుసాక్షివీవె। సకలభూతములకును ప్రకటింపఁగనునీవె - సమయింపఁ జేయంగశక్తి నీదె॥ తే॥ యింతవాఁడవునీగుణంబెంచ లేక - యితరవిబుధులతో సమమెంచు కొనుచుఁ। దెలియలేకనుదిరిగెదరు తెలివితప్పి॥భద్ర॥ 56

సీ॥ నీగొప్పనీబుద్ధినీదుసాత్వికమును- నీరూపునీయున్కి మేలుగం ద్రదు।నీదయకుదురునునీయోగ్యతనునీదు- ప్రవిమలకారుణ్య మెవడెరుం గు। నీవెట్టివాడవో నిజముగానగలేరు - నిన్ను దెలియుటకు నెన్న వశమె। నీవాక్కరసమునునీయింపుదెలియరు - నీమాయలన్ని యు నెమక లేరు॥ తే॥ మాయపరుఁడవునీవునుమాయబన్ని - వైరిజనులను జేసియు వెతల పెట్టి। కానరాకుండనుంటివిఘనుఁడవీవె॥భద్ర॥ 57

సీ॥ దురితనీరధిలోనదూరియుదుఃఖమైనె - యీదలేకక్కటయిట్టు

లుంటి। నీపాదభక్తియను రూపించునావచే - దాటవలయుననితలచుకొం
టి। పదపడినిప్పుడు ప్రార్థించుచుంటిని-నాదుభయముఁ బాపునలిననేత్ర।
వలదనియిప్పుడువదలివేయకునన్ను- దోసిలొగ్గితినయ్య దోషహరణ॥
తే॥ దారిజూపియుచేర్చుముదరికినన్ను -నీవువిడచిననన్నోమనెవరికాను।
నీవెగతినాకునెప్పుడునిజముగాను॥భద్ర॥ 58

సీ॥ ఏనుజేసినతప్పులెన్నియెన్నఁగలేను- నిన్ను నేనెప్పుడునెన్ను
చుండు। నాజిహ్వారసమునునోజగోరుచునుండె నాగుణంబంతయునట్టు
తప్పె। నామదికుదురుగానీమీఁదగనకుంటి- నీదేహమెట్టిదినెరుఁగకుంటి।
నామనన్నును నేనునమ్మజాలకయుంటి- నెవరుజెప్పినమాటనెంచకుంటి॥
తే॥ దవిలినిన్ను నేఁదలఁచితిదాతవీవు- రామరామయనగజిల్కరమ్యము
గను। గాచినట్టునునన్నునుగావవలయు॥భద్ర॥ 59

సీ॥ గునపంబుచేబూనికొండద్రవ్వినరీతి-ధరనుగుద్దలిచేతద్రవ్వినట్టు। తర్కవాదంబునతమస్వరూపము నేడు- రంజిల్లగొంటినిరామచంద్ర।
భక్తిశ్రద్ధలనుచేబాగుగాస్మరియించి - హస్తగతియుజేసియమరుకొంటి।
హృత్కమలమునందునెప్పుడువసియింపు - దీనపోషకనీవుదివ్యముగను॥
తే॥ వేదవేదాంతవేద్యనిన్వేడుకొంటి - నాదుమదియందునెప్పుడునమ్మక
ముగ। గదలకుండుమునీవునుగరుణతోడ॥భద్ర॥ 60

సీ॥ పాలమీఁగడలోనబరగంగమానఫుల్ - పంచదారనుగల్పిబా
గుగాను। అతిమోహముననదాని ననుభవించినరీతి నీనామరసమునునియ
మమొప్ప। నిశ్చలమతిచేతనేమదిదీరను మక్కపళ్ళరమనమాడ్కిమా
డ్కి। సమముగాహితవును జక్కగానిప్పుడు గ్రోలుచుంటినినేనుగొఱంత
లేక॥ తే॥ దక్కినదినాకుననుచునుదలఁచుకొనుచు - జుట్టుజుట్టుగరుచుల
నుజూఱకొందు। నన్నుసంతుష్టినొందించునాథనీవు॥భద్ర॥ 61

సీ॥ ఘోరపాతకములగోటమీటుచునీవు సద్గతినిత్తువుసచ్చరిత్ర।
సజ్జనాళికినెల్లసారభూజంబగు షడ్వికారంబులజయుఁడవీవు। సకలసాధు
లలోనసార్వభౌముఁడవీవు - సర్వమునీలోనసంక్రమించు। పరమదైవమ
టంచుఁబ్రస్తుతిచేసినే- నెంచిభజించెదనెలమితోడ॥ తే॥ నీదుమహిమం
బునెందునునెమకలేరు- నిజముగనుఁగొన్నఁగాంతురునిన్నుదేవ। సత్యము
నుదప్పిచెడుచుంద్రుదుజనులుజగతి॥భద్ర॥ 62

సీ॥ కృష్ణఘనాభనిన్నెంత వేఁడినగాని- కానరాకుంటివికరుణతో
డ। జాలముజేసియుజాడగానగరావు - సంతుష్టినన్నునుసలుపుమెపుడు,
సంతుష్టినొందినసకలపావననీదు - నామమెంచెదనేనునళిననేత్ర। ము క్తి
కిఁబ్రాపుగామూలమైయుండును - పాపమూలములన్ని పాఱఁజిమ్మి॥
తే॥ అట్టినామంబుదాఁచియుకట్టులియ్యు - పంతమెందుకునాయందుఁబర
మపురుష। పరగగతియదిగాదయ్యభక్తరతుఁ॥భద్ర॥ 63

సీ॥ కరుణతోనీదివ్యకరుణామృతంబున - నభిషిక్తుఁజేయవేయా
దిపురుష। నాదుదురితములనసియింపఁగాఁజేసి- వైరివర్గము నెల్లవదలివేసి।
నీబంటనైనేనునిశ్చలంబుగనుండి- కాలకింకరభీతిగానకుండ। యెమునిబా
ధలనునేనరయకయుండెద - నుర్విమానవులందుయోగ్యునిగను॥
తే॥ గాంచికరుణింప గతినీవెగావవలయుఁ దెలియకేదారి నిట్లటుదిరుగు
చుంటి। మంచిమార్గంబునను బెట్టుమక్కువుంచి॥భద్ర॥ 64

సీ॥ పాతకులైనభవత్కృపా పాత్రుల్లు- కలయఁజూచిననైనదె
లియగలరు। చక్రాయినాతిగాఁజక్కగాఁజేసియు - నమరారికిరాజ్యమ
మరనొసఁగి। కిష్కింధనినజునకింపుగానిచ్చియు- సనకసనందనుల్ సన్ను
తింప। జలధియప్పుడునిన్ను సన్నుతి జేసిన- నతనిబాధలనెల్లనడఁచినావు॥
తే॥ భోగభాగ్యంబులనొసంగిపొందుపరచి - పాపములనెల్ల బాపెడుప్ర
భుడుఁడవీవె। ఇహపరంబులొసంగుటకీవెకావె॥భద్ర॥ 65

సీ॥ నీరజేక్షణనీదునిల్కడగనలేక- నిష్టతోనీభక్తినిలుపలేక। స
చవృత్తులచేతనిన్నెంచగాలేక నీలోనభావననెగడలేక । నీమర్మమంత
యునిండగానగలేక- యఖిలసౌఖ్యపదవినొందలేక। అష్టభోగంబులనను
భవింపఁగలేక-నిష్టతోనినుమదినిలుపలేక॥ తే॥ అష్టకష్టంబులన్నియు
ననుభవించి- కుటిలబుద్ధినిమానవుల్ గుందుచుండ్రి॥ రకటవారినిరక్షించు
నయ్యవీవె॥భద్ర॥ 66

సీ॥ నిన్నెప్పుడుజనుల్నియతితోఁతలఁచిన- నిహపరసాధనల్ నిం
డియుండు । నిన్నునెల్లప్పుడునిజముగాఁ్రమొక్కిన సకలదుష్కృతములు
నమసిపోవు। నిత్యంబుపఠియించునిర్మలాత్ములయందు। నేమరకుండుమువిం
పుతోడ। నీయందుదృష్టినినిజముగానిల్పిన-నీలోనజేతువునిశ్చలముగ॥
తే॥ నిన్నుదెలియకనరకోటినిర్మలాత్మ- యుర్విభోగంబులనుగోరుచుండ

రయ్యా! నిన్ను జేరెడుమార్గంబు నెమకరయ్యా॥భద్ర॥ 67
సీ॥ సూరిజనులయందు సూనృతవాదుల - వ్రాతంబులందు నబరగ
నుండి। వీరపతివ్రతా వేదవిప్రులయందు - గోవులందు నెపుడు గోర్కె దీర। దా
క్షిణ్యాపరులందు దాతవై వర్తిల్లి వసుమతీ - భారంబు బాపుటకును। పుడమి
యందు జనుల బుణ్యులఁ - జేసితి దానిగానగలేక మానవాళి। తే॥ నిష్టలను
నుంచితలపక నిఖిలమందు। తృణముమాత్రముగ దలంచి దీనులగుచు। తిరు
గుచుండెదరిలయందు తీరులేక॥భద్ర॥ 68
సీ॥ సూర్యవంశజ నిన్ను నార్యులు చెప్పఁగా విని - సంతసిల్లితి వే
డ్కఁ జోడ। పైతృవాక్యమునకుఁ బరిపాలనుడ నీవు - నీకు సాటి ధరను నెమ
కలేరు। భక్తి శ్రద్ధలకును భరతుని కంటెను - నెంచి చూతుమటన్న నెందు
లేరు। శౌర్యధైర్యములకు శత్రుఘ్నుని దిరారు - లక్షణంబులకెల్ల లక్ష్మణుం
డె। తే॥ సీతపతిభక్తియును జెప్ప చేతనౌనె। యిలను నిటువంటివారలింకెం
దుగలరు। దశరథసుత మీకును జెల్లు ధరణియందు॥భద్ర॥ 69
సీ॥ పాపమొందెదు వేళఁ బరగ యుద్ధమునందుఁ - బతితపావన నిన్ను
బిలిచి నేని। భయముఁ గలిగిన వేళ బాధవచ్చిన వేళ - నాపదగను వేళనాదు
కొనవె। యొచెగి నిందలచిన నీవు నీతమ్ములు నెమ్మిఁ - కార్యములందు నిలుపగ
లరు। నిన్ను మనసునందు నిల్పలేక జనుండు। తల్లిదండ్రుల నెల్ల తలచుచు గాను
తే॥ తనదు బాధలఁ దీర్పఁడీయనుచుఁ బిలచి। వారువీరు దుఃఖంపుచు వరుస
గాను। కష్టమొందుచునుందురు భ్రష్టులకట॥భద్ర॥ 70
సీ॥ యెక్కడి తల్లియు నెక్కడి తండ్రియు నెక్కడి సుతులును నెవరికె
వరు। ఎక్కడి సతియును నెక్కడి చుట్టము లెక్కడి జీవుడు నెట్టితనువు పుట్టు
చుఁబోవుచుఁ బోలుపుగా నెక్కడే వీరిలో నొక్కరు వెంటరారు। పాపపుణ్యం
బులఁ బొందుట కొక్కఁడే యనిమది తెలియలేరల్పజనులు॥ తే॥ భవము
నొందంగ లేనయ్య పరమపురుష। నీదు మాయలోఁ బెట్టక నెనరునుంచి। నీ
వుతోడుగనుండుము నిత్యమునను॥ భద్ర॥ 71
సీ॥ సోమకదైత్యుండు చోరుఁడై వేదంబులపహరింపుచు వేగనబ్ధిఁజొ
చ్చ। నీరజనాభుండు నిన్ను వేఁడినతటి మత్స్యావతారమై మటియు వేగ। నబ్ధి
లోఁ జొరబడి యంతయుఁ దిరుగుచు ఘుమఘుమధ్వనులచే ఘోషసల్ప।
పాతాళమునఁ జొచ్చిపట్టియు సోమకున్ జంపి వేదంబుల సాకియపుడె

తే॥ యజునకిచ్చినయా ప్రుఁడవరయనీవె। నిన్ను స్తుతియింపవిధికైన నేర్పు గలదె। శక్తిశౌర్యములకునీకుసాటిలేరు॥భద్ర॥ 72

సీ॥ అమృతంబుకొఱకునయ్యసురులుదేవతల్- గలసిమందరగిరి కవ్వముగను। జెలువొప్పఁగడలిసక్షీరపాత్రంబుగ - నహిరాజుత్రాడుగా నమరఁజేసి। తఱువఁగానప్పుడుతమబలంబునుదగ్గి- పర్వతంబుమునిఁగిభా రమొసఁగ। హాకృష్ణదరిఁజేరి యాదుకొమ్మనివేఁడఁ - గూర్మావతారమై కొండనెత్తి॥ తే॥ అమృతమునుదీసియసురులకందనీక। దేవతలకిచ్చితివి గదదివ్యముగను। తేజరిల్లుచునుండిరిదీనరక్ష॥ భద్ర॥ 73

సీ॥ ధరనుచాపగజుట్టితర్లించుచుండహి- రణ్యాక్షుఁడొనరించుర ట్టుజూజి। దేవతులందఱుదీనులైనిన్నుమ్రొక్క - దేదీప్యముగనీవుతేజ రిల్లి। వరహావతారంబువరుసతోనుదయించి- వానిగర్భముజేరిత్రవ్వియాలిం చి। సంహరింపుచునీవుజగతిప్రఖ్యాతిగా- జయభేరిఁబొందినజయుఁడవీవు॥ తే॥ ధర్మమునకునుపెద్దవుదాతవీవె। తలఁచుకొన్నవారికిదయనొసం గ। నీకుసరియైనదైవంబునెమకగలడె॥భద్ర॥ 74

సీ॥ ప్రహ్లాదుఁడుమిముఁదలంచినఁమాత్రాన- దనకులాచారం బుదప్పెననుచుఁ। దనతండ్రియప్పుడుదౌర్జన్యమునుజేయఁ - దాళలేక తఁడాత్మఁదమరిఁబిలువ। నేఁడిరాశ్రీనాధుఁడెక్కడనుండినాఁ- డుక్కుస్తం భమునందునుండెననగ। నరసింహరూపంబుధరియించి స్తంభంబు - పద ఘట్టనముచేతఁబగలఁదన్ని॥ తే॥ రక్కసునిబట్టిగోళ్ళచేరాల్చినావు। బా లుగాచినవరదుడవారిజాక్ష।నిఖిలజగములనీకీర్తినిలచెనెపుడు॥భద్ర॥ 75

సీ॥ అమరేంద్రముఖనిర్జరాళిగెల్చుచుబలి - యేకచక్రంబుగానే లుచుండ। నాబాధఁబడలేకయమరులుమిముఁగూర్చి - యాదుకొమ్మని చాలనడుగఁగాను। అదితిగర్భంబుననంగుష్ఠమాత్రాన- వటుఁడవైజన్మిం చివన్నెమీర। పంచశిఖలనుంచిపచ్చగోచినిబెట్టి- దండకృష్ణాజినమొం దుదాల్చి॥ తే। వేషమునువేసివేగంబవెళ్లియపుడు। బలినిమూడడుగుల డిగిపాదములిడి। త్రిభువనంబులఁగొన్నట్టిధీరుఁడవుర॥భద్ర॥ 76

సీ॥ జమదగ్నిసుతుఁడవైజనియించినీవల - పరశురామాఖ్యచేఁ బ్రబలముగను। విలువిద్యలకునెల్లవిక్రమొన్నతుఁడవై- శరమునఖండిం

చిక్షత్రియులను। ఆశోణితంబునను మరఁగఁదండ్రికి- నర్పితంబుగఁ జేసియధికుఁడయ్యు। ధరణిభూసురులకు దాతవై యిచ్చిన - పరశురాముఁడవీవె భవ్యచరిత॥ తే॥ సర్వజనులకు నెల్లను సంభ్రమముగ । సీతసహితమైరాముఁడు చేరరాఁగ। నెదురుచని తేజమొసఁగినదీవు కాదె॥ భద్ర॥ 77

సీ॥ సూర్యవంశంబిలశుచియైనదనియెంచి - దశరథేశ్వరునకుఁ డనయుఁడయ్యు। భరతలక్ష్మణులకు భావింపనన్నవై - సౌందర్యమూలకెల్ల స్థానమగుచు। శౌర్యధైర్యములకుఁ జాతుర్యములకెల్ల - నావాలమవగుచునతిశయిల్లి। సీతను పెండ్లాడి శీఘ్రంబుగా నీవు- వివిధ భాగ్యంబుల వెలసినావు॥ తే॥ అబ్జయోన్యాది దేవులకలవికాని। రావణునిఁ జంపితివి నీవు రణమునందు। అమరనుత నామ భానువంశాబ్ధిసోమ॥ భద్ర॥ 78

సీ॥ దేవకీసుతుఁడవై తేజరిల్లుచు నుసీ -వజునిగర్భంబునను మరనుంచి: మూడులోకంబులు మూసినట్టుగఁ జేసి- బ్రహ్మప్రార్థింపఁగా బయలువెడలి। బలరామయుతుఁడవై బలముగా నీవును - దుష్టులనెల్లను ద్రుంచినావు। శిష్టులనెల్లరశీఘ్రంబరక్షించి - గోపికలెల్లరు గొలిచిరి నిన్నుఁ॥ తే॥ గూడసంతుష్టిపరచిన ప్రౌఢమూర్తి। నీదుమాయను జిక్కించి నేర్పుమీర। నేలితివి నీవు శ్రీకృష్ణనియతిగాను॥ భద్ర॥ 79

సీ॥ త్రిపురదైత్యులనెల్లధీరతమిత్తికి- భుక్తి జేయఁగ మదిఁ బూనియపుడు। వారియంగనలనమీరుసమీపించి- తమిమీరఁగఁ గుచకుంభములఁ బుణికి। పరిరంభణము సేసి బాగుగానప్పుడు- సతుల మోహితలుగఁ జక్కఁబరచి। బింబాధరంబులఁ బ్రేమతో నొక్కి-యు- వ్రతభంగమును జేసివారినెల్ల॥ తే॥ చెట్టగుట్టలపాలుగఁ జేర్చియపుడు। త్రిపురదైత్యులఁ గాల్చియు దేజరిలిన। బుద్ధగుణమూర్తివై త్రిభువనములను॥ భద్ర॥ 80

సీ॥ కలియుగాంతమునందుఁ గలికావతారమై-ధరణితురష్కులఁ దస్కరులను। జండాలపతితులఁ జార్వాకిగణములఁ - బాషండమండలీపతులనెరి। క్రమాక్రమపర్ణయుతాక్రమపర్ణి తీర- బ్రహ్మవిద్బ్రాహ్మణబాలుడవయి। పుట్టియుత్తముడవై భూమండలమునందు- నశ్వంబుపైనెక్కియమరనపుడు॥ తే॥ డాలుకత్తిని చేబూని దండమగను। జోదుదొడగుచునప్పుడు చోద్యముగను। పుడమియందున దుష్టుల బాపెదార॥ భద్ర॥ 81

సీ॥ పాదద్వయంబునుబరగనిలసుమోపి- పవనునిబంధించిభక్తి తోడ। పంచేంద్రియంబులుబరిమార్చి వెంటనే- హస్తద్వయంబునునమరబట్టి। బుద్ధియునీయందుపూర్ణంబుగనునిల్పి - యేకచిత్తంబుగానిలనునరులు। తలచినమాత్రానదయయేలరాకుండు- కానలేకనుజనుల్ కష్టమనుచు॥ తే॥ యేలపదములుబాడుచుహీనులంత। క్రీడలందునదృష్టిడిక్రియనుగనక। మోహసాగరంబునబడిముఁనుగుచుంద్రు॥భద్ర॥ 82

సీ॥ కరములచేమ్రొక్కి-కన్నులతోజూచి- జిహ్వామీస్మరణంబుసేయుచుండి। వీనులమీకథల్ వినుచుండజేసియు - ధ్యానమీయందునదనరుచుండె। నట్టిజనులకెల్లనమితకరుణతోడ - పరమార్థ చింతనుపాదుగొలిపి। నీదయారసమునునిండుగానుంచియు - ముక్తినోసంగెదుముదముతోడ॥ తే॥ గానకనుభక్తినీయందుగలుగనీక। నిమిషమాత్రంబునినుమదిని నిలుపలేక। దిరుగుచుందురుజ్ఞానార్థ మెరుకలేక॥భద్ర॥ 83

సీ॥ మదిననూహయుయేమరకయున్నప్పుడే. కఫవాతపైత్యముల్ముప్పనపుడె। మలహీనమైమేనిపట్టుతప్పనపుడె- తెలివిదప్పుచుమతిదిరుగనపుడె। కటకదంతముల్కదలకున్నప్పుడే- కామమోహంబులుగదలనపుడె। మానవజన్మంబుమహిలోననెత్తియు - మోక్షసాధంబునుబొందవలయు॥ తే॥ యేమిలేకనువ్యర్థులైభూమిజనులు। కించనెందెదుకారణంబెంచలేను। ఆశగొలదినిదిరిగెదనవనియందు॥భద్ర॥ 84

సీ॥ ఇలనెన్నిజన్మములెత్తిచచ్చినగాని - నరజన్మమునుజెందతరముగాదు। నినుమదిదలచుటఘనమంచునెరుఁగక - దుష్కథలందుండిదూరిపోయి। పరమార్థములనెల్లబాఱదోలియునటు- దుష్కృతంబులయందుదూరిమరియు। సకలదోషంబులుసంపూర్తి జేసుక- మృత్యుదేవతచేతమ్రింగబడియు॥ తే॥యమునిచేజిక్కియుడుములసంభవించి। పుట్టుగిట్టుచునుందుగుపుడమియందు। నిన్నునెప్పుడుమదియందునిల్పకుండ॥భ॥

సీ॥ సర్పరాజుభరింపజాలునాధరణినీ- బలముననట్టులనిలచెగాక సింధువునకునడ్డుచెలియలికట్టయా- నీయాజ్ఞచేనిట్లునిలచెగాక। వేదశాస్త్రనిచయవిజ్ఞానమునజను- ల్నిలచిరానీమాయబలిమిగాక। యినరశ్మిరావెల్గునింపుగానిచ్చునా - నీయంశమునశక్తినిలచెగాక॥ తే॥ నీదునా

యంబు లేనిదినిశ్చయముగ। భూమిక్రుంగునుసంద్రంబుపొంగువెడలు। జ
నులు చెడుదురుచీకటిజగతియాను॥భద్ర॥ 86

సీ॥ యెల్లజగంబులనెవ్వాడుమాయచే- సృష్టింపజేసినాడిష్టమూ
ర్తి। వుడమియంతయునేనిపోషణలోనుండు - నెవ్వనియందులయించు
చుండు। పరమేశుడెవ్వఁడుపరికించిచూడగా- మూలకారణుడునుముఖ్యు
డెవడో।ఆద్యంతములు లేనియధికుఁడెవ్వడోగాన-సకలంబుతానైనసరసు
డెవడో॥ తే॥ అట్టిపురుషునిగోవిల్పునట్టిజనుల। కెల్లసుఖములుప్రాప్తిం
చునెంచిచూడ। భజనజేసినమాత్రాన బాయునఘము॥ భద్ర॥ 87

సీ॥ శ్రీరఘురామనీచారిత్రములనెల్ల - పఠనజేసెడువారుపరమ
యోగి। శ్రీరఘురామనీచిత్రపుంగథలెల్ల- నాలించువాడెపోనాత్మవేత్త।
శ్రీరఘురామనిన్ జేరినిచ్చలుపాద - పూజజేసినవాఁడుపుణ్యజనుఁడు ।
శ్రీరఘురామనిన్ జిత్తమందుననిల్పి- సేవజేసినవాడుసిద్ధయోగి॥ తే॥ రా
మనినుమదినెప్పుడురమ్యముగను। భజనజేసెడివారికిపరమపదవి। కలుగ
కుండక యెటుబోవుకమలనేత్ర॥భద్ర. 88

సీ॥ తులసీదళంబులుతులదూగదెచ్చినీ - కర్పించుమనుజాళియా
త్మబొంగి। నీతుల్యులై వారునిజముగానుందురు - నాకభోగంబులననుభ
వింత్రు। పాటలీపుష్పముల్ పరగంగగొనివచ్చి-పూజజేసిననరుల్పుణ్యులై
రి। వరపద్మములగొనిభక్తితోఁబూజింప- ముక్తిగలుగునుమాకు భోగిశ
యన॥ తే॥ మల్లెమొదలగుపువ్వులుకొల్లలుగను। దెచ్చియర్చనచేసినధీ
రకోటి। దీనవత్సలనినుజేరుదేవవినుత॥భద్ర. 89

సీ॥ నిన్నుభజించెదనిండుగానిత్యంబు - నినుమదినెప్పుడు నిల్పు
కొందు। నీదుదయకునేనునిత్యంబుప్రార్థింతు- భక్తితోనినుమదిప్రస్తు
తింతు । నీనామరూపముల్ నిజముగానెన్నుదు - నీచిద్విలాసంబుజూచు
చుందు, నీకుమధర్మములెన్నెగడంగజేయుదు- నీమీఁదప్రేమనునిల్పుకొం
దు॥ తే॥ రేయుబగలునుగనురెప్ప వేయకుండఁ। జూపునీయందునిల్పుచు
సొంపుగాను। జూచుచుంటినినిరుమదిశూలివినుత॥భద్ర. 90

సీ॥ ఆపదలన్నియునలమినయప్పుడు- ధృతిమతిపీడకదిరుగువారు,
అధికారమొందియునణగియుండెడివారు - కానంతగర్వంబుగనినవారు!

